Annual Subscription Rs. 2/-only.

Reg. No. M. 2749.

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU





VOL. V BEZWADA—JULY 1936 No. 7

# A 'GREAT INDIA'



POLICY ALONE

## WILL PERPETUATE THAT HAPPINESS

**Apply for a Prospectus and compare it with others before effecting your Insurance.**

---

### WANTED

Influential Representatives all over the ANDHRA DESA on Salary and Commission. Previous experience not essential.

---

*Apply to either* :

V. B. SHANKAR RAO,
Asst. Secretary,
GUNTUR.

OR

BRANCH SECRETARY,
35, Angappa Naick St.,
G. T. MADRAS.

# భీ మా ప త్రి క

గౌ ర వ పో ష కు లు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. యె., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

# భీ మా ప త్రి క

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోస్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు:—మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

## BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India).

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అనుపేరుఉదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత............................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

మేనేజరు,

భీమా పత్రిక.

బెజవాడ,
తేది 29—7—36.




# చెరుకువాడవారి భీమా కంపెనీల తిరుగుళ్లు

ఆంధ్రదేశములో సుప్రసిద్ధ భీమాపురుషులు శ్రీయుత చెరుకువాడ వెంకటనరసింహంపంతులు గారు యీనెల 18,25 తేదీలలో కృష్ణా పత్రికకు వ్రాసిన “ భీమా కంపెనీల తిరుగుళ్ళు ” అనే రెండువ్యాసములు చాల గమనింపదగినవి. వీరు ఏజంట్ల అధ్యాయములో వివరించిన ఏజంట్ల కష్టములును, కంపెనీలవారు ఏజన్సీ ప్రారంభములో ఏజంట్లపై విధించు షరతులలో గల తికమకలును పాతఏజంట్లకు కొంతవరకు అనుభవవేద్యములే. వీరు పదిసంవత్సరములుగా కొన్నిలక్షల జీవితభీమావ్యాపారముచేసి సంపాదించిన అనుభవములు ఆంధ్రదేశములోగలపాతఏజంట్లకేగాక నూతనముగఏజన్సీలనుతీసుకొనుయువకులకుకూడ మిక్కిలి ఉపయోగపడుననుటకు సందేహము లేదు. 1937 సం॥రలో భీమాకంపెనీల చట్టము మార్పుకానున్న సమయమునను ఏజంట్లు కష్టసుఖములనుగూర్చిసంప్రదింపులుసల్పి ప్రభుత్వము వారికిని కంపెనీలవారికిని తెల్పుటకు రాబోవు సెప్టెంబరు నెల 26, 27 తేదీలలో గుంటూరు పట్టణమున తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీల ఏజంట్లమహాసభ కూడనున్న సమయమునను శ్రీచెరుకువాడవారి వ్యాసములు భీమాలోకమున కెంతేని వినియోగపడగలవు. వారి వ్యాసములు చాల ముఖ్యమైనవని తలంచుటచే అందులోని మొదటి వ్యాసమును కృష్ణాపత్రికనుండి యీసంచికలో పునర్ముద్రణచేసియుంటిమి. పాఠకులును అందులో ముఖ్యముగా భీమాఏజంటువృత్తినవలంబింప దలచినవారును యీవ్యాసములలోని విషయములను గమనించి భీమాఏజన్సీలోగల లాభములను పొందుదురని నమ్ముచున్నాము. మంచి సమయమున భీమాలోకమునకును, ఏజంట్లకును, ఏజంటు వృత్తి నవలంబించు వారికిని మిక్కిలి ఉపయోగించు వ్యాసములను వ్రాసినందులకు శ్రీయుత నరసింహం పంతులుగారిని మేమెంతయు అభినందించుచున్నాము శ్రీనరసింహముపంతులుగారు తమ అనుభవములను యిట్టివ్యాసములరూపేణా భీమాలోకమునకు వెల్లడిపరచి భీమాయేజంట్ల సోదరబృందమునకు మిగుల తోడ్పడెదరని ఆశించుచున్నాము.

II

# తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమా కంపెనీ ఏజంట్ల మహాసభ

# గుంటూరు

## The Third Andhra Desa Indian Insurance Companies Agents' Conference, Guntur

ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీ ఏజంట్ల ప్రథమ మహాసభ భీమాశాస్త్రవేత్త శ్రీయుత కె. బి. మాధవగారి అధ్యక్షత క్రింద 1932 సం॥రలో బెజవాడ పట్టణమున సమావేశ మయ్యెను. ద్వితీయమహాసభకూడ 1935 సం॥లో బెజవాడ పట్టణముననే భీమా శాస్త్రవేత్త శ్రీయుత జి. యస్. మరాతేగారి అధ్యక్షత క్రింద సమావేశ మయ్యెను. ఈరెండు మహాసభలును చాల జయప్రదముగ జరిగెను. మూడవ మహాసభను యీ సంవత్సరములోన గుంటూరు పురమున జరుపుటకు ఆహ్వానించియుండిరి. ఈనెల 7వ తేదీని గుంటూరులోనున్న భీమా కంపెనీల ఏజంట్లు ఒక్కచో సమావేశమై ఆహ్వాన సంఘముగా నేర్పడిరి. గుంటూరు న్యూయిండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ ప్రత్యేక ప్రతినిధి శ్రీయుత వి. వి. పి. సుబ్రహ్మణ్యం. బి. ఏ., బి.యల్.గారు ఆహ్వాన సంఘమునకు అధ్యక్షులుగాను, ఏషియన్ అస్యూరెన్సు కంపెనీ గుంటూరు శాంచి మేనేజరు శ్రీయుత నందమూరు వెంకట చలపతిరావుగారు ఉపాధ్యక్షులుగను, స్టార్ ఆఫ్ యిండియా యిండస్ట్రియల్ అండు జనరల్ అస్యూరెన్సు కంపెనీ, గుంటూరు శాంచి మేనేజరు డి. రామకృష్ణయ్యగారు జనరల్ సెక్రటరీగను శ్రీయుత సూరంపూడి కనక రాజుపంతులుగారు జనరల్ఆర్గనై జరుగను నియోగింపబడిరి. మహాసభ రాబోవు సెప్టెంబరు నెల 26, 27 తేదీలలో గుంటూరు పట్టణమున జరుపుటకు తీర్మానింపబడెను. అందులకుతగిన ఏర్పాటులు చురుకుగ జరుగుచున్నవి.

ఇదివరలో జరిగిన మహాసభలకంటె ఈమహాసభకు ఎక్కువ ప్రాముఖ్యత యుండు ననుటకు సందేహములేదు. రాబోవు సంవత్సరములో హిందూదేశ భీమాకంపెనీల చట్టములో కొన్ని మార్పులు జరుగనున్నవి. ఏజంట్లను లైసెన్సు చేయుటకు కూడ కంపెనీలవారు ప్రయత్నములు చేయుచున్నారు. ఇట్టితరుణమునసంఘీభావముతో ఐక్యకంఠమున దేశీయ భీమా కంపెనీ ఏజంట్లు తమ కష్టములను గూర్చి ప్రభుత్వము వారికిని, కంపెనీల వారికిని తెలియపర్చవలసి యున్నది. కావున ఆంధ్రదేశములో పనిచేయుచున్న దేశీయ భీమాకంపెనీ ఏజంట్లందరును, సదరు మహాసభకు ప్రతినిధులుగా విచ్చేసి తమతమ అభిప్రాయములను వెల్లడిపరచి మహాసభ జయప్రదముగ జరుగునట్లు చేయూత నొసంగెదరని నమ్ముచున్నాము.

III

# బెజవాడలో

# హిందూస్థాన్ కోఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటీ లిమిటెడ్ వారి నూతన సబ్ ఆఫీసు

## The Hindusthan Co-operative Insurance Society, Limited, Bezwada Sub Office.

కలకత్తాహిందూస్థాన్ కోఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటీవారు యీ నెల 23 వ తేదీని బెజవాడలో వాణీప్రెస్సుకు సమీపముననున్న శ్రీయుత యినటూరి సాంబశివరావుగారి భవనమున నూతనముగ ఒక సబ్ ఆఫీసును నెలకొల్పిరి. ఈ కంపెనీ తరఫుననే విశాఖపట్టణమున ఆర్గనైజరుగ పనిచేయుచున్న శ్రీయుత కానరబాదా సదాశివరావుగారిని సదరు బెజవాడ సబ్ ఆఫీసునకు ఆర్గనైజరుగా నియమించిరి. శ్రీయుత సదాశివరావుగారిని గాని, హిందుస్థాన్ కోఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటీ వారిని గాని ఆంధ్రులకు, అందులో ముఖ్యముగా బెజవాడ పౌరులకు, ప్రత్యేకముగ నెరుకపర్చనవసరములేదు. వీరుభయులును ఆంధ్రభీమాలోకమున కేకాక బెజవాడపౌరులకును చిరపరిచితులే. ఏజన్సీలను ఏర్పాటుచేయుటలో శ్రీయుత సదాశివరావుగారు కడుసమర్థులు. ఆంధ్రదేశములో ప్రతి సంవత్సరమున అన్నికంపెనీలకు మొత్తముమీద దాదాపు ఒకకోటి యాబదిలక్షల రూపాయిల జీవిత భీమావ్యాపారము జరుగుచున్నదని అంచనా వేయబడుచున్నది. ఈవ్యాపారములో సగమువంతు వ్యాపారము బెజవాడ సెంటరు నుండియే పోవుచున్నది. బెజవాడ ఆంధ్రదేశమున కంతటికిని కూడలి స్థానము.

ఇచ్చట యిదివరలో చాల కంపెనీల వారు తమ సబ్ ఆఫీసులను నెలకొల్పిరి. హిందూస్థాన్ కో ఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటివారు తమకంపెనీవ్యాపారాభివృద్ధిని కోరి వెంటనే బెజవాడపట్టణమున సబ్ ఆఫీసు నెలకొల్పి అంధ్రులనే సదరు సబ్ ఆఫీసు ఆర్గనైజరుగా నేర్పాటు చేయుటలో తమ వ్యాపారదూరదృష్టిని వెల్లడి పరచిరి. ఈకంపెనీవారు యిదివరలో యావజ్జీవిత భీమాలపై సం॥ 1కి 1000 కి రు 20/ లు చొ॥నను ఎండోమెంటు భీమాలపై సం॥ 1కి 1000 కి రు 23/లు చొప్పునను బోనస్సును పంచిపెట్టిరి. ఈకంపెనీవారి రాబోవు ఆస్తిఅప్పుల విలువ మదింపు (Valuation) 1936-37 సం॥లో జరుగును.

అప్పుడు యింతకంటె ఎక్కువ బోనస్సును పంచుట కవకాశముండునని తలంపబడుచున్నది. బెజవాడ సబ్ ఆఫీసు శ్రీయుత సదాశివరావుగారియాజమాన్యమున దినదినాభివృద్ధి గాంచుగాకయని కోరుచున్నాము.




పదకొండు సంవత్సరములుగా యంపైర్ ఆఫ్ యిండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీతరఫున బెజవాడ పట్టణమున ఏజంటుగా పని చేయుచున్న శ్రీయుత సూరంపూడి కనక రాజు పంతులుగారు తమ ఉద్యోగమునకు రాజీనామాయిచ్చి బొంబాయి ఏషియన్ అస్యూరెన్సు కంపెనీవారి గుంటూరుబ్రాంచి తరఫున 1936 సం॥ జూలై 1 వ తేదీనుండి జనరల్ ఆర్గనైజరుగా ప్రవేశించిరి.

* * * *

ఇదివరలో తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలలో కార్నర్ లైఫ్ యిన్సూరెన్సు కంపెనీతరఫున రాజమండ్రిలో ఆర్గనైజరుగా పనిచేసిన శ్రీయుత డి. ఆనందమోహన్ గారు 1936 సం॥ జూన్ 15 వ తేదీనుండి లాహోరు లక్ష్మియిన్సూరెన్సు కంపెనీతరఫున తెలుగు జిల్లాలలో పని చేయుటకు ఆర్గనైజరు పదవి నంగీకరించి మిక్కిలి చురుకుగా పనిచేయుచున్నారు.

* * * *

తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీఏజంట్లసభ రాబోవు సెప్టెంబరు నెల 26,27 తేదీలలో గుంటూరు పట్టణమున జరుపుటకు ఏర్పాటులు జరుగుచున్నవి.

* * * *

ఈ నెల 18వ తేదీని ఢిల్లీ వీనస్ అస్యూరెన్సు కంపెనీ మేనేజరు శ్రీయుత బొమ్ములూరు నరసింహంపంతులుగారు బెజవాడలో నూతనముగ శ్రీయుత కామవరపు వెంకటాద్రిగారి యాజమాన్యమున నెలకొల్పబడిన తమ ఆఫీసును సందర్శించుటకు వచ్చియుండిరి. తత్సందర్భమున శ్రీయుత వెంకటాద్రిగారు మిత్రులకు అల్పాహారవిందొసంగిరి. ఆఫీసు సిబ్బంది ఆర్గనైజర్లు బ్రాంచి మేనేజర్లతో గూడియున్న శ్రీయుత నరసింహం పంతులుగారి ఛాయాపటము తీయబడెను. శ్రీ నరసింహంగారు 19 వ తేదీని తిరిగి ఆంధ్రదేశ పర్యటనమునకు పయనమై వెళ్ళిరి.

* * * *

శ్రీయుత బొమ్ములూరు నరసింహం పంతులుగారు తమ ఆంధ్రదేశ పర్యటనమును ముగించి ఈనెల 27 తేదీని బెజవాడ మీదుగా ఢిల్లీకి పయనమై వెళ్ళిరి.

* * * *

పోలీసు డిపార్టుమెంటులో పనిజేసి పింఛన్ తీసుకున్న రావుసాహెబు కె. బ్రహ్మయ్య పంతులుగారు రాబోవు ఆగష్టు నెల 1 వ తేదీనుండి వీనస్ అస్యూరెన్సు కంపెనీ మదరాసు ఆఫీసు సూపరింటెండెంటుగా పనిజేసెదరని తెలియుచున్నది.

* * * *

కలకత్తా హిందూస్థాన్ కోఆపరేటివ్ యిన్సూరెన్సు సొసైటీ మదరాసు బ్రాంచి సెక్రెటరీ శ్రీయుత యస్. యమ్. చౌదరిగారు యీనెల 28 తేదీని బెజవాడ వచ్చి యుండిరి.

* * * *




# విజయలక్ష్మి జనరల్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

## Vijaya Lakshmi General Assurance Co., Ltd.. Madras.

ఈ కంపెనీవారు 1935 సం॥రం డిశంబరు నెల 31 తేదీతో అంతమగు సంవత్సరాంతపు లెఖలను పరిపాలనా నివేదికను ప్రచురించిరి. ఈకంపెనీవారు 1935 సం॥ రంలో రు 8,88,000/—లు భీమామొత్తమునకు రు 45,304ల సంవత్సరప్రీమియములురాబడి గలిగిన 532 పట్టాలను జారీచేసియుండిరి. ఈసంవత్సరములో రు 93,758/6లు ప్రీమియం రాబడియును, కంపెనీ పెట్టుబళ్ళపై రు 2239-8-5 లు వడ్డీయును, నానాబాపతుజమలు క్రింద రు24-5-0లును మొత్తము రు 96022-3-5 లు రాబడి వచ్చియుండెను.

ఈరాబడిలో రు 7000/- లు చనిపోయినవారి వారసుల హక్కులక్రిందను రు 100/- లు యితర వార్షికములకును రు 58,350-3-5 లు మానేజిమెంటు ఖర్చులక్రిందను మొత్తమురు65450-3-5 లును ఖర్చులుచేసి యుండిరి. ఖర్చులు పోగా మిగిలిన రు 30572/-లును జీవితభీమానిధికి చేర్చి యుండిరి. సంవత్సరాంతమునకు మొత్తము రు 45,250-14-8 లు జీవిత భీమానిధి గలదు. వ్యాపారమునకు తగినట్టు ఖర్చులనుకూడ మితముగనే చేయుచున్నారు. కంపెనీ ఖర్చులను తగ్గించి వ్యాపారమును మరింత కట్టుదిట్టముతో నడుపుటకు డైరక్టర్లు నూతన విధానము నవలంబించుటచే యీ సంవత్సరములో నూతనవ్యాపారము కొంచెము తక్కువగ నున్నప్పటికిని జీవిత భీమానిధికి తగిన మొత్తమునుచేర్చి యుండుట చూడ చాలసంతోషము. చనిపోయినవారి క్లెయిములనుకూడ దరఖాస్తులు అందులకు సంబంధించిన కాగితములు వచ్చిన వెంటనే పరిష్కరించుచునేయున్నారు. సంవత్సరాంతమునకు ఈ కంపెనీకిరు 1,76,805-7-8 లు ఆస్తిగలదు. ఈఆస్తి అంతయు భద్రమైన పెట్టుబళ్లలో నిల్వచేయబడెను. ఆర్గనైజేషన్ విషయములో యీకంపెనీవారి నూతన విధానమును గూర్చి శ్రీయుత జి. యస్. మరాఠేగారు యీాదిగువ వ్రాసిన విషయము చాల గమనింపదగినది.

“మీాకంపెనీ డైరక్టర్లు నియమించిన ఖర్చుల దామాయిషా రేటులోపలనే ఖర్చులను చేయుటకు చేసుకొనిన నిశ్చయమునకు చాలసంతోషము. ఎక్కువ ఖర్చులతో సంపాదించిన ఎక్కువ వ్యాపారము కంటె మితమైన ఖర్చులతో సంపాదించిన తక్కువ వ్యాపారమే చాలశ్రేయస్కరము.” ఈకంపెనీవారు తమవ్యాపారమును సర్వవిధముల జాగ్రత్తగనే నడుపుచున్నారు.

# ఏషియన్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ బొంబాయి

## Asian Assurance Company Limited,, Bombay.

ఈకంపెనీయొక్క 1935 సం॥ డిశంబరునెల 31 తేదీతో అంతమగు సంవత్సర పరిపాలనా నివేదికయు లెక్కలును ప్రకటింపబడెను. పరిపాలనా నివేదికకాలములో (1935 సం॥రంలో) యీకంపెనీవారు దాదాపుఒక కోటి రూపాయలకు భీమాదరఖాస్తులను సంపాదించిరి. కాని యీ కోటిరూపాయల మొత్తములోను సంవత్సరము ముగియులోపల రు 76,43,220/—లకు భీమాపట్టాలను జారీచేసి యుండిరి. మిగిలిన దరఖాస్తులలో త్రోసివేసినవి పోగా నిల్చియున్న దరఖాస్తులకు యీ సంవత్సరములో పట్టాలను జారీచేయుదురు. సంవత్సరాంతమునకు కంపెనీ మొత్తముమీద 2,52,08,418/-లు భీమా వ్యాపారము అమలులో నున్నది. ఈసంవత్సరములో రు 18,39,296-3-6లు రాబడి వచ్చియుండెను. ఈరాబడిలో చనిపోయినపట్టాదారుల వారసులకును జీవించియుండి పండిపోయిన పట్టాదారులకును రు 3,61,935-11-4 లును పట్టాల హక్కువిడుదలకు రు 7,950-9-0 లును పట్టాదారులకు నగదు బోనస్సుక్రింద రు1,712-15-0 లు ను రు 3,71, 599-3-4 మా నే జిమెంటు వగయిరా ఖర్చులక్రిందను వెరశి రు 9,42, 808-14-1 లును ఖర్చుపరచి మిగిలిన రు 8,96,487-5-5 లును జీవితభీమానిధికి చేర్చియుండిరి. సంవత్సరాంతమునకు కంపెనీమొత్తం మీద రు 42,98,820-1-11 లు జీవితభీమానిధి గలదు. సంవత్సరాంతమునకు కంపెనీ మొత్తము మీద రు 49,05,286-8-5-లు ఆస్తిగలదు. ఈ ఆస్తిఅంతయు మంచి మంచి రాబడిగల భద్రమైన పెట్టుబళ్లలో నిల్వచేయబడెను.

ఈసంవత్సరము కంపెనీ జూబిలీ సంవత్సరమగుటచే షేరుహోల్డర్లకు తమ షేర్లపై సంవత్సరము 1కి నూటికి రు 10/-లు చొ॥న డివిడెండును పంచిరి. 1935 సంవత్సరాంతము ఈ కంపెనీయొక్క ఆస్తిఅప్పుల విలువ మదింపు (Valuation) వేయబడెను. ఈవిలువమదింపులో దాదాపు 4½ లక్షలరూపాయలు లాభము తేల్చబడెను. ఈ మొత్తములో పట్టాదారులకు ఎండోమెంటు భీమాలపై సంవత్సరము 1కి 1000 1కి రు 15/-లు చొ॥నను, యావజ్జీవిత భీమాపట్టాలపై సంవత్సరము 1కి రు 1000 1కి రు 20/-లు చొ॥నను బోనస్సును పంచిరి. ఈకంపెనీవారి తక్కువ ప్రీమియము రేట్లనుబట్టి చూచిన వీరు యిప్పుడు పంచిన బోనస్సు చాల సంతృప్తికరముగనున్నదని చెప్పవచ్చును. ఈకంపెనీవారిలెఖ్ఖలును పరిపాలనా నివేదికయు జాగ్రత్తగ పరిశీలించిన వీరి వ్యాపారము ఆనాడుకంటె ఆనాడు సర్వతోముఖాభివృద్ధి గాంచుచున్నదని తెలియగలదు.

1935 సంవత్సరాంతముతో యీకంపెనీ వయస్సు 25 సంవత్సరములు దాటి 26 సంవత్సరములు ప్రవేసించెను. గడచిన ఏప్రిల్ నెలలో దేశమంతటను యీ నెలలో బొంబాయినగరమునను యీకంపెనీ యొక్క రజతోత్సవమును అతివైభవములో జరిపిరి.

—

# ట్రాపికల్ ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ - ఢిల్లీ

**Tropical Insurance Co, Ltd., Delhi.**

ఈ కంపెనీ ప్రధాన కార్యస్థానము ఢిల్లీ. 1927 సం॥రలో స్థాపింపబడెను. కీ॥ శే॥ హకీమ్ అజమల్ ఖాన్, కీ॥ శే॥ పండిత మోతీలాల్ నెహ్రూ ఈ కంపెనీ ప్రధాన స్థాపకులు డైరక్టర్లుగ గూడనుండిరి. కీ॥ శే॥ డాక్టరు అన్సారీగారు చనిపోవువరకు యీ కంపెనీ అధ్యక్షులుగ నున్నారు. ఈ కంపెనీ బ్రాంచీలు సబ్ ఆఫీసులు, ఛీఫ్ ఏజన్సీలు దేశమునందంతటను గలవు. ఆంధ్ర దేశములో వీరివ్యాపారాభివృద్ధికొరకు యీమధ్య నూతనముగ బెజవాడ గాంధీనగరములో ఒక ఛీఫ్ ఆర్గనైజింగ్ ఆఫీసు నెలకొల్పిరి. ఈఆఫీసునకు శ్రీయుత బి. యస్. మణియం పిళ్ళేగారిని చీఫ్ ఆర్గనైజరుగా నియమించిరి. వీరియాజమాన్యమున బెజవాడలో స్థాపించిన ఆర్గనైజింగు ఆఫీసు దినదినాభివృద్ధిగాంచి హిందూదేశ భీమా వ్యాపారాభివృద్ధికి మిగుల తోడ్పడునని ఆశించుచున్నాము.

---




చెరుకువాడ నరశింహముగారు

## ఏజంట్ల అధ్యాయము

### 1

ఈమధ్య కొంతకాలమునుండి భీమాకంపెనీలు భీమావ్యాపారం మన దేశములోకూడా వృద్ధి కావటం మిక్కిలి సంతోషదాయకం. అనేకమంది విద్యావంతులైన యువకులు ఈ భీమాఏజంటువృత్తి చాలా స్వతంత్రమైనదనిన్నీ, ఎక్కువ లాభకరమైనదనిన్నీ నమ్మి, యేదో కంపెనీతో బేరమాడి, ఒక యేజంటుగిరి సంపాదించుకొని యెంతో వుత్సాహముతో తమ శక్తిసామర్థ్యాలను, పలుకుబడిని, స్నేహబాంధవ్యాలను, పూర్తిగా వినియోగించుకొని, యెంతోకష్టపడి విరిగి తునకలై పనిచేస్తున్నారు. నిర్వ్యాపారత్వము, బహుధన సంపాదనాపేక్ష సమృద్ధిగా దేశమునందు వ్యాపించియున్న సందర్భాలనెల్ల ఆధారంగాగొని, భీమాకంపెనీలవారందరును చీఫ్ యేజంట్లు, ఆర్గనైజర్లు అనేపేరిట మాబోటి మధ్యదళారీల నేర్పాటుచేసి, వారిద్వారా యీ భీమాయేజంట్ల పటాలమును తయారుజేసి, తమ వ్యాపారసామ్రాజ్యాలను విరివిగా విస్తరింప జేసుకొంటున్నారు. ఈ భీమాయేజంట్లకు మొదటి సంవత్సర ప్రీమియములమీద పెద్దపెద్ద కమీషన్ రేట్లు, అలవెన్సులున్నూ, దరిమిలా ప్రీమియములమీద వార్ధక్యంలో పింఛనుగా అనుభవించదగిన చక్కని రెన్యూయల్ కమీషన్ రేట్లున్నూ, అరచేతిలో స్వర్గంవలె చూపించి నోరూరేటట్లు ఆశపెట్టి, యెందరో యువకులను, మర్యాదస్థులను యేజెంటువృత్తిలోనికి తారుస్తున్నారు. భీమాయేజెంట్లకుజరిగే ద్రోహాలు, అన్యాయాలు, హింసలు తలుచుకుంటే గుండెలు బద్దలై పోవును. క్రొత్త యేజంట్లకు ఇందలి మాయలు మర్మాలు వూహించుటకైనా శక్యం కాదు. పాతయేజంట్లకవి అనుభవపూర్వకంగా తెలిసినా వూబిలో చిక్కిన లేడివలె బయటపడే మార్గం లేక ముందుకుపోయే దారిలేక, తమ గోడు వినే దిక్కులేక, తమ అవివేకాన్ని దుర దురదృష్టాన్ని నిందించుకొంటూ, అందులోనే కుంగి కృశించిపోతున్నారు పాతవారి అనుభవం క్రొత్తవారికి వుపయోగపడటంలేదు. నిజానికి యీ భీమాయేజెంటువృత్తివంటి పరాధీనమైనది, అవమానకరమైనది మరియొకటి వుండునని ఊహింపరాదు. ఇంతకంటె బానిసవృత్తి మేలుగానుండునంటే అతిశయోక్తికాదు. చాలా భీమాకంపెనీలు తమ యేజంట్లను జీతభత్యములులేని తాబేదార్లుగా చూస్తున్నారు.

భీమాకంపెనీ వారికి తమ యేజెంటుపై అనుగ్రహం తప్పినట్లుయితే, యెప్పుడైనాగాని కారణం చెప్పకుండానే, అవిచారణగానే, అనుమానంమీదకూడా అతన్ని తీసివేయ వచ్చును; వానిని దుష్టగణంలోజేర్చి యింకెక్కడను తలదాచుకునే నీడలేకుండా చేస్తామనికూడా బెదిరిస్తూవుంటారు. వారి నిర్ణయంమీద అప్పీలులేదు.

ఏజంటుమీద నేరారోపణచేసే కంపెనీఅధికారులే వానిని శిక్షించి తీర్పుచెప్పే న్యాయమూర్తులు, కంపెనీకి యేజెంట్లకు మధ్యవచ్చే యే తగాదాలోను బీదవాడైన యేజెంటుతో వాదిగానో ప్రతివాదిగానో వుండి మధ్యవర్తి పరిష్కారమున కియ్యకొనుట ధనాఢ్యులైన కంపెనీ అధికారుల ప్రతిష్ఠా గౌరవాహంకారములకు భంగకరమని వారు సాధారణముగా భావింతురు.

భీమాయేజెంటునకు తన పట్టాదారుడు సొమ్ము చెల్లించినంతకాలము రాదగిన రెన్యుయల్ కమీషను వానికి పూర్తిగా దక్కకుండా భీమాకంపెనీలు యెన్నో ప్రతిబంధకాలు సృష్టించి వానికెంతో అన్యాయం చేస్తూన్నారు. అందు ముఖ్యమైన ప్రతిబంధకాలు మూడు. (1) ఇంకే భీమా కంపెనీకిని పనిచేయకూడదు. అనగా ఆ యేజెంటు తన జీవితకాలంలో యే సందర్భములోను, మరి యే భీమాకంపెనీకిని పనిచేయకూడదని యర్థము. దీనికే Loyalty clause, లేక ప్రభు భక్తి నియమ మని పేరు. (2) ఆయేజెంటు జీవితంతో అతని రెన్యుయల్ కమీషన్ ఆగిపోతుంది. ఈ షరతు యేజెన్సీకంట్రాక్టులో యెక్కడను స్పష్టముగా ఉదాహరింపబడి యుండదు. కాని తక్కిన యేజెన్సీ షరతులన్నీ చదువుకుంటే యీ షరతు గర్భితంగా వాటిలోనే యిమిడి వుంటుంది. (3) భీమాయేజెంటు రెన్యుయల్ కమీషన్ పొందుటకు ప్రతిసంవత్సరము కనీసం ఐదువేల రూపాయల క్రొత్త వ్యాపారమును ఆ కంపెనీకి సమకూరుస్తూ వుండవలెను. ఇది అనంత కాలంవరకు జరుగుతూవుండవలసిన నియమము.

క్రొత్తగా భీమాయేజెంటుగా ప్రవేశించే వారికిని, ఉత్సాహంగా వ్యాపారంసాగిస్తూ కంపెనీవారి మెప్పుమన్ననలను పొందుతూవుండే యేజెంట్లకును మొదటి ఐదారు సంవత్సరములలో, పైనవివరించిన రెన్యుయల్ కమీషన్ నిబంధనలు ఏమీ ప్రతిబంధకములుగా తోచవు. క్రమంగా శరీరపాటవము తగ్గినప్పుడు పాతరోగములు బైటపడునట్లు యేజెంటుశక్తిసామర్థ్యములు సన్నగిలినపుడు వీని కాఠిన్యము, అంతులిఅన్యాయము యేజెంటునకు అనుభవవేద్య మగును. యేజెంటునకు వచ్చే రెన్యూయల్ కమీషన్ 4% గాని 5% గాని పట్టాదారుడు చెల్లించే ప్రీమియములోనే చేర్చబడివున్నది. పైనవివరించిన మూడునియమాలు కేవలం యేజెంటునకు సొంతంగా రెన్యుయల్ కమీషన్ గుటకు దిగకుండుటకు చేసిన ఉపాయములు.

పైన వివరించిన రెన్యుయల్ కమీషన్ నియమాలు కంపెనీలయొక్క శ్రేయోభివృద్ధుల కత్యవసరమని కంపెనీలపక్షమునుండి కొందరు వాదింతురు. ఒక కంపెనీవారు మరియొక కంపెనీలో రీ-యిన్సూరెన్సు చేసేసందర్భములో యీపై మూడునియమాలతో నిమిత్తంలేకుండా రెన్యుయల్ కమీషను సొంతంగా ఆకంపెనీలకు యిస్తూనే వుంటారు. అప్పుడీపైవాదన యేమైపోవును? పర్మనెంటుగాగాని దీర్ఘకాలమునకు గాని మేనేజింగేజెన్సీలు తీసికొన్నవారికిని, రిజిష్టరు కంపెనీల పేరిట ఏజన్సీలు తీసికొన్నవారికిని యీ పైమూడు నియమాలు పూర్తిగా వర్తించవు. అసలు భీమాయేజెన్సీని వృత్తిగా పెట్టుకొని కష్టపడి పనిచేసే సాధారణ పేదయేజెంటునకుమాత్రమే రెన్యుయల్ కమీషన్ విషయంలో సర్వవిధాల అన్యాయం జరుగుతున్నది.

### (1) లాయిల్టీ క్లాజు

భీమాయేజెంటు మాత్రం యెట్టి సందర్భంలోను మహాపతివ్రతాశిరోమణియైన హిందూ

భార్యవలె తానొకమారు చేపట్టిన తన కంపెనీ భర్తనే సేవిస్తూ, తన జీవయాత్రను పూర్తిగా గడపవలెను. సతీ అనసూయటాకీలో చివరభాగమున ప్రదర్శింపబడిన కుష్ఠురోగిభార్యయైన పతివ్రతాకథ చూచినప్పుడు, భీమాయేజెంట్ల ప్రభు భక్తి నియమంజ్ఞాపకంవస్తూవుంటుంది. బహుశా భీమాకంపెనీల నిర్మాతలు హిందూధర్మశాస్త్రములలోని యీ పతివ్రతాధర్మముల ననుకరించియే భీమాయేజెంట్లుకూడా తమ జన్మలో మరియొక కంపెనీవంక చూడకూడదనే పతిభక్తి నియమాన్ని విధించిరికాబోలు. ఈవక్క నియమంవల్ల భీమాకంపెనీలు నిర్భయంగా తమ యేజెంట్లకు యెంతఅన్యాయంజేసినా, యెంత అవమానంచేసినా, ఎన్నిహింసలు కలిగించినా, యేమీం యిబ్బందిలేకుండా వారి వ్యాపారం నిరాఘాటంగా సాగిపోతున్నది. ఏజెన్సీ షరతులను, కమీషనురేట్లను కంపెనీవారు యేజెంట్ల అనుమతితో నిమిత్తంలేకుండా, యెప్పుడైనను యథేచ్ఛగా మార్పుచేయవచ్చును. తనభర్త తన్నినా, కొట్టినా, తిట్టినా, యేహింసపెట్టినా, యేవగించుకొనక అకుంఠితభక్తితో పతిసేవ చేసినదే పతివ్రతాశిరోమణి. అట్లాగే భీమాయేజంటుకూడా వుండవలెనని భీమాకంపెనీల వుద్దేశ్యము. హిందూధర్మశాస్త్రప్రకారం భార్య తనకుపయోగకరంగా వున్నా లేకపోయినా, ఆమెనుపోషించే భారం భర్తకు విధించారు. కాని అట్లు భీమాయేజెంటును చూడవలసినభారం మాత్రం యేకంపెనీకి విధాయకంగా లేదు. భీమాయేజెంటుకు కంపెనీపరిపాలనలో ప్రాతినిధ్యము కావలెనంటే "రోజుకూలీవలె అతను చేసినపనికి ప్రతిఫలంగా కమీషను యెప్పటికప్పుడు తీసికునేవానికి పరిపాలనతో సంబంధమెందుకుండవలె" నని ప్రశ్నింతురు.

ఒక ధనాఢ్యుడు ఎన్ని భీమాకంపెనీలలోనైనా షేర్లుకొనుక్కొని, పరిమితమైన బాధ్యతతోను, అపరిమితములైన లాభప్రయోజనాధికారములతోను వాటి కన్నింటికిని యేక కాలమున యజమానిగా నుండవచ్చును. అతనికి లాయల్టీక్లాజు లేదు.

మరియొక భాగ్యవంతుడు యేకకాలమున ఎన్ని భీమాకంపెనీలలోనైనా డైరక్టరుగా నుండి సిట్టింగ్ఫీజులు ప్రయాణపుభత్యాలు వసూలు చేసుకుంటూ, వాని పరిపాలనారహస్యాలనన్నీ తెలిసికొంటూ, అన్యోన్యవిరుద్ధం లేకుండా సమబుద్ధితో ధర్మపాలన చేయగలడని లోక విశ్వాసము. ఇతనికి లాయల్టీక్లాజు అక్కరలేదు.

వేరొకపుణ్యశాలి యెన్ని భీమాకంపెనీలలో యెన్నిభీమాపట్టాలు తీసుకొంటే అంతయెక్కువ భీమావ్యాపారాభిమాని క్రింద అన్నికంపెనీల వారు వానిని యెప్పుడూ పొగడుతూవుంటారు. ఆయనకేమీ పక్షపాతబుద్ధి ఆపాదించకూడదు. అందుచే లాయల్టీక్లాజు ఆయనకూ లేదు.

ఇంకొక షావుకారు యెన్ని భీమాకంపెనీలలోనైనా డిబెంచర్లు కొని వానికన్నిటికి యేక కాలములో పెట్టుబడిదారుగనుంటే తప్పులేదు. అతనికి లాయల్టీక్లాజులేదు.

వేరొక్క ధర్మమూర్తియైన డాక్టరు మహాశయుడు హాయిగావచ్చే తన వైద్యపరీక్షారుసుము వసూలు చేసికొంటూ యెన్ని భీమాకంపెనీలకో యేకకాలమున డాక్టరుగా పనిచేస్తూ వున్నా తప్పులేకపోవుటయే కాకుండా అది అతని ప్రజ్ఞావిశేషమునకు నిదర్శనముగా భావింపబడుతున్నది. అతనికి ఈలాయల్టీక్లాజుతో నిమిత్తంలేదు.

మరియొక సంపన్నుడైన మహాశయుడు తనకు భీమా సిద్ధాంతములమీద గాని, భీమాకంపెనీల

మీదగాని యీమాత్రం విశ్వాసం లేకపోయినను, కేవలం లాభసాటి బేరమునకున్నూ అధికారనిర్వహణంకొరకున్నూ యెన్ని భీమాకంపెనీలకైన యెన్ని సంవత్సరాలైనా పారంపర్య వాక్కులతో డైరెక్టరుగా నుండవచ్చును. ఆయనను తాను డైరెక్టరుగానున్న కంపెనీలోనైనా మచ్చునకైనా భీమాచేయలేదేమని ప్రశ్నించకూడదు. ఆ ప్రశ్న కాయన జవాబు చెప్పవలసిన పనిలేదు. ఆయన కేమీ లాయల్టీ బాకీ లేదు. ఇట్టి పుణ్యాత్ము లెందరో భీమాకంపెనీలకు ఇప్పుడు పరిపాలకులుగా నున్నారు. అట్టివారి పూజ్యనామములు కంపెనీ డైరెక్టర్ల లిస్టులో చేర్చుటచేతనే కంపెనీ లన్నియు చరితార్థత నొందుచున్నవని వారి నమ్మకము. వీరందరు ధర్మస్వరూపులైన పురుషపుంగవులు, ధనాఢ్యులు, శాస్త్రజ్ఞాన సంపన్నులు, సుప్రసిద్ధులు, ప్రజావిశ్వాసపాత్రులు. వీరి స్వాతంత్ర్యము నెవ్వరు ప్రశ్నించగూడదు.

ఇంక భీమాయేజెంట్లో, ఆజన్మదాస్యమునకును, కొన్ని సందర్భాల్లో వంశపారంపర్య దాస్యమునకు గూడ అంగీకరించిన కడుపు కక్కుర్తి బానిస. వానిని అష్టదిగ్బంధములతో జీవితాంతమువరకు బంధించి యుంచకపోతే పాపము భీమాకంపెనీలకు యెంతో విద్రోహం కలుగుతుంది.

(సశేషము)

(కృష్ణాపత్రికనుండి)

[ 132 వ పేజీతరువాయి ]

కరపత్రాలలో ఒక కరపత్రాన్ని తయారు చేయుము. [మార్కులు 25

4. నీకంపెనీ కుటుంబానికి ఆదాయంగా వచ్చే పట్టాను (ఫామిలీ ఇన్కం) తయారు చేయించి దానిని అమలుపరచడానికి యీదిగువ లాభాలను కలిగించింది.

(i) పట్టా పుట్టిన తేదీలగాయితు 20 సంవత్సరములలో ఎప్పుడు మరణం సంభవించినా

(ఎ) అపుడు వెంటనే యిచ్చేసొమ్ము పౌ 300 లు,

(బి) పట్టాపుట్టిన తేదీ లగాయతు 20 వత్సరముల గడవు వరకును ప్రతి 5 ఏండ్లకు పౌ 156 ల చొ॥ నాల్గుతఫాలుగా యివ్వగలందులకు ఏర్పాటు,

(సి) 700 పౌనులు 20 వత్సరములవాయిదా అనంతరం యిచ్చుటకున్నూ ఏర్పాటు

(ii) 20 వత్సరముల గడవు అనంతరం మరణంసంభవిస్తే పైవేమియుగాకుండా 1000 పౌనులు మొత్తంగా యిచ్చివేయుట.

ఈ అంశములలో ఒక కరపత్రంగాని లేక ప్రాస్పెక్టస్సునుగాని వ్రాయుము.

[మార్కులు 35

5. ఒకపెద్ద కంపెనీయొక్క మానేజింగు డైరక్టరు తనకంపెనీలోని ఉద్యోగస్థులలో చనిపోయినపుడున్ను ముసలివారైనపుడున్ను అట్టివారి కుపకరించే పద్ధతితో సొమ్ము యిచ్చు ఏర్పాటుకు నిన్ను సలహా అడిగెను. నీవిచ్చు ప్రణాళికలో ఉద్యోగస్థులకు సంబంధించిన దై ఉండవలెను. అందు కగుఖర్చులు వారే భరించునదిగా ఉండవలెను. అందుకు వారు అంగీకరించి నడిపితే దాని చాకచక్యమునుబట్టి కంపెనీవారు తమకు తోచినధనసహాయంచేయుదురు? అందుకు సంబంధించినప్రణాళిక ఎటులుండవలెనో నిరూపింపుము.

(సశేషము)



# A. C. I. I. లండను పరీక్ష

ఇదివరలో పార్టు రెండులో గ్రూపు A ప్రశ్నావళిని తర్జుమా చేసితిని. ఇపుడు పార్టు II. గ్రూపు B ప్రశ్నావళిని తర్జుమా చేయుడమైనది.

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు)

## పార్టు II. గ్రూపు B.

మరణములు - మదింపుగా వేసినవెల

(మోర్టాలిటీ అండు ఎలిమెంటు ఆఫ్ వాల్యుఏషను)

3 గంటలు.

ప్రశ్నలు

1. "పోలసీ" "కాలండర్" "జీవితము" అను వాటి సాలీనాపద్ధతులు మరణపు పట్టీలను తయారుచేయుటలో ఏలా ఉపకరించును? ఏయే పరిస్థితులలో, యీ పైమూడు పద్ధతులు దేనంతటకది ఏసంబంధంతో ఉపయోగపడును? "పట్టాను" యొక్క సాలుపద్ధతిని వయస్సు యొక్క లెక్కలు కట్టుటలోను బ్రతికియున్నంత కాలమువరకు లెక్క కట్టుటలోను, వదలుకొన్నపుడు మున్నగు సందర్భాలలో లెక్కలు కట్టుటలోను ఏలా ఉపయోగింతువు? మార్కులు 25

2. ఈమరణముల సంఖ్యను నిర్ణయించుటలో నుండే వివిధ పద్ధతులలో ఉపయోగించే రెండు రకాలను కనపరచుము. ఇందులో నీవు ఏపద్ధతిని అంగీకరిస్తావు? ఎందుచేత? మార్కులు 25

3. ఒక కంపెనీ తనవాల్యుఏషన్నుకు (బోనసుయిచ్చుటకు తయారుచేసే లెక్కలు) O.M. (ఆఫీసుమేల్సు) అంటే ఆకంపెనీలో ఇన్సూరు చేసిన మగవారిలో ఏవయస్సువారు ఎంతవరకు బ్రతికి యుండిరో అన్న అంకెలను బట్టి పద్ధతితో తయారుచేసిన మరణముల సంఖ్యనుబట్టి లెక్కలు తేల్చిజూస్తే అనుకున్న మదింపుసంఖ్యగాక నూటికి 53 గ్గురే చనిపోయినటుల కనబడినది. ఇటుల తగ్గుటకుండే కారణము లేమి? మార్కులు 20

4 ఇన్స్టిట్యూట్యు ఆఫ్ ఆక్ట్యుయరీస్ వారున్నూ ఫేకల్టీ ఆఫ్ ఆక్ట్యుయరీస్ వారున్నూ, (జీవిత భీమాకంపెనీల యొక్క మదింపు లెక్కలను తయారు చేయుశాస్త్రములోని నిపుణులకు సంబంధించిన సంఘములు. ఇవి ఇంగ్లండులో నున్నవి.) భీమాచేసినవారి జీవితములపై మరణముల సంఖ్యను తేలుసను విషయంలో యీ మధ్యను క్రొత్తగా కనిపెట్టిన అంశము ఏది? ఆ అంశములో యీదిగువ వాటినిగూర్చి ప్రత్యేకంగా ఏలా వ్యవహరించిరి:—

(ఎ) ఉపయోగించిన దూరము మూలసిద్ధాంతము.

(బి) మరణముల సంఖ్యను నిర్ణయించుటకుగాను అవలంబించిన పద్ధతులు.

(సి) ఏర్చిఎత్తుకొనిన విధానము?

మార్కులు 30

5. ఈదిగువ వాటికి ఏలామదింపు కట్టాలి? వాటిల్లో ఒక దానితో మరొకటి కలిపి మదింపు కట్టేపద్ధతిలో ఏపద్ధతిని ఉపయోగించెదవు?

(ఎ) తాత్కాలికపు భీమా
(బి) తేడాలతో కూడిన ,,
(సి) స్వచ్ఛమైన నియమితకాలము ,,
(డి) తేడాలతో కూడిన సాలీనా సొమ్ము (ఆన్యుయిటీస్)
(ఇ) పూర్వస్థితికి మరలవచ్చే సాలీనాసొమ్ము (రివర్షనరీ ఆన్యుయిటీస్) [మార్కులు 20]

6. ఒకకంపెనీయొక్క వాయిదా మదింపుసొమ్ముల నిర్ణయంలో లాభములతో కూడిన వ్యాపారముమీాదసామాన్యంగా పూర్వస్థితికి తిరిగివచ్చే బోనస్సుఇచ్చుటకుగాను(సింపిల్ రివర్షనరీబోనస్సు) O.M. 2½% నిర్ణయమున్నూ రివర్షనరీ బోనస్సు (పూర్వపు స్థితికి మరలవచ్చే)యాన్యుటీలో O.M. 3½% న్ను ఉపయోగించెను. ఈ రెండు పద్ధతులలో ఆఖరు పద్ధతినే లాభాలులేని వ్యాపారమునకు మదింపుకట్టుటలో కూడ(Without Profit) నుపయోగించెను. దీనిని విమర్శన చేయుము. దానికికారణములువ్రాస్తూ అసలు ఉద్దేశ్యాలకు భంగకరంరాని మరోపద్ధతిని సూచింపుము.

మార్కులు 25

7. జీవితభీమా కంపెనీలకు వచ్చే అదనపు సొమ్ము (సర్ప్లస్) ఏపద్ధతులవల్ల వస్తూఉంటుంది. ఆపద్ధతులలో ఒకదానితో మరొకదానికి ఉండే సంబంధ బాంధవ్యములనుగూర్చి వివరించుటలో (ఎ) ఈమధ్య సంవత్సరాలలో కలిగిన అనుభవములను (బి) ఇప్పటి స్థితి ముందు స్థితినిబట్టి యోచించి వ్రాయుము.

మార్కులు 30

8. 1909 ఎస్యూరెన్సు కంపెనీ చట్టముయొక్క 5 వ షెడ్యూలునకు ఎట్టిసముజాయిషీని యియ్యాలి? అట్టి సముజాయిషీలు యిచ్చుటకుండే కారణము లేమి? మార్కులు 25

మొత్తము 200

పార్టు II. గ్రూపు. B.

కంపెనీపరిపాలన మామూలుగా జరిగేపని.

3 గంటలు

ప్రశ్నలు

1. బోర్డుఆఫ్ ట్రేడు వారికి (ఇండియాలో ఇండియాగవర్నమెంటునకు) సాలుఆఖరున జీవిత భీమాకంపెనీలవారు పంపేలెక్కలలో యీాదిగువ వాటిని గూర్చి ఏలాఉంచాలి?

(ఎ) పట్టాదార్లకిచ్చేసొమ్ము.
(బి) క్రొత్తగా చేసే వ్యాపారము.

[మార్కులు 15

2. కొన్ని సమయాలలో కొన్ని జీవిత భీమా కంపెనీలు తమకువచ్చిన భీమాదరఖాస్తులకు వాటితో పాటు కంపెనీయొక్క డాక్టరు పరీక్షాపత్రము వచ్చినపుడు అట్టి పరీక్షాపత్రంతో సంతుష్టి పడకుండా ఆ దరఖాస్తుదారుయొక్క స్వంతడాక్టరు నుండి అదనంగా సముజాయిషీని కోరవలసిన అగత్యం వస్తుంది.

(i) స్వంత డాక్టరును అడిగే ప్రశ్నలు సాధారణంగా ఏలా వుంటాయి?

(ii) పై అంశములను కోరునపుడు ఆ స్వంత డాక్టరునకు వుత్తరం వ్రాసినపుడు ఏలా వ్రాస్తావు?

[మార్కులు 25

3. ఆన్యూయిటీస్ యిచ్చునపుడు (సాలీనా సొమ్ము చెల్లించునపుడు) యీా దిగువ సందర్భాలలో ఏపద్ధతిని అవలంబించాలో వ్రాయుము. (ఇందుకుపయోగించే ఫారములయొక్క నమూనా ఇయ్యుము.)

(ఎ) సొమ్ము అసలువానికి చెల్లించునపుడు.
(బి) అసలు ఆసామీాసంతకం చేయలేనపుడు అట్టి వానికి సొమ్ము యిచ్చునపుడు.
(సి) అసలు వానికి సొమ్ము యియ్యకుండా అతని యొక్క సొమ్మున్న బ్యాంకు

చెల్లించినపుడు. [మార్కులు 20

4. ఎండోమెంటు ఎస్స్యూరెన్సును గూర్చి చెల్లుపత్రాలమీదను ప్రచురణ చేయాలంటే ఏపద్ధతిని అవలంబించాలో పూర్తిగావివరించుము. ఇట్టి దానికి కావలసిన అంకెలనుగూర్చి అడిగే వారికి తగుసమాధానం యిచ్చుటకుగాను ఎట్టి పద్ధతితో అంకెలను తెలుపులెక్క లుంచాలి? [మార్కులు 30

5. తిరిగి భీమా చేయడమనే పద్ధతి ఏస్థితిలో అవసరం? ఈ దిగువ సందర్భాలలో ఏపద్ధతిని అవలంబించాలో వ్రాయుము.

(ఎ) దరఖాస్తు ఫారం జేరగానే.

(బి) మరణము సంగతి తెలిసి నపుడు. [మార్కులు 20

6. నీకంపెనీ మరోదేశములో నూతనంగా బ్రాంచి ఆఫీసు పెట్టునపుడు అందుండే లాభ నష్టములనుగూర్చి వివరించుటలో యీదిగువ వాటినిగూర్చి యోచించి వ్రాయుము.

(i) హెడ్డాఫీసు చేసేపనినే బ్రాంచి ఆఫీసు చేయడం.

(ii) బ్రాంచిమేనేజరు కుండే అధికారము లను హెచ్చించుట. [మార్కులు 25

7. ఏజంట్ల ద్వారా క్రొత్తవ్యాపారమును హెచ్చుగా సాగించుటకుగాను తీసుకునే పద్ధతు లేమి? [మార్కులు 20

8. ఈదిగువ వారిని నియమించుటలో అట్టి వారి కుండవలసిన ప్రత్యేక అర్హతలువవివున్నా యని జూస్తావు:—

(i) ఒకశాఖకు మేనేజరు

(ii) ఏజంటు

(iii) క్రొత్తగుమస్తా

[మార్కులు 15

9. ఈదిగువ తెలిపిన పరికరములయొక్క లాభములను కూర్చి వ్రాయుము.

(i) చిరునామాలయంత్రము

(ii) లెక్క కూర్చేది, పట్టీలుగా ఏర్పరుచు యంత్రము, కార్డులకు బెజ్జాలుచేసే దాని కుపయోగించే విద్యుచ్ఛక్తి.

(iii) ఫోటోకు నకలుగా తీయు యంత్రము.

ఆయంత్రములను పై వాటికి ఉపయోగించు విధానము తెలుపుము. [మార్కులు 30

మొత్తము 200

పార్టు II. గ్రూపు B.

ప్రచురణవిధానము కంపెనీవల్ల కలిగే లాభములను తెలిపేగ్రంధము (ప్రాస్పెక్టస్సు)

3 గంటలు

ప్రశ్నలు

1. ఈదిగువ వాటిని గూర్చి ప్రచురణచే యడంలో నీ అభిప్రాయ మేమి ?

(ఎ) గోడకు తగిలించే కాలండర్సు.

(బి) జూపించే కార్డులు.

(సి) చిన్నచిన్నవి కూర్చివ్రాసేవి

మార్కులు 30

(2) జీవిత భీమా పట్టాతో ఇల్లు కొనుక్కోవ డానికుండే సంబంధ బాంధవ్యములతో కూడిన నొక ప్రచురణను వార్తా పత్రికలో ప్రచురించు టకు వీలుగానుండే మాదిరీని నొకటివ్రాయుము.

6 అంగుళముల పొడవున జంటవరుసలో ఇముడునట్లు వ్రాయుము (డబుల్ కాలమ్సు)

[మార్కులు 25

3. వృత్తి వ్యాపారస్తులలో దంతవైద్యుల నుండి భీమావ్యాపారమును రాబట్టుటకుగాను ప్రణాళికల తయారుచేయుము. ఆలాతయారుచేయు టలోవ్రాసే ఉత్తరాలలో ఒకఉత్తరాన్ని లేక

[129 వ పేజీ చూడుడు.]

# THE NORTHERN INDIA INSURANCE COMPANY, LIMITED, LAHORE.

PATRON :— His Highness, Raja SIR JOGINDER SEN BAHADUR, K. C. S. I. Ruler of Mandi State.

**The only Accident Life Insurance Company in India**

| | |
|---|---|
| Natural Death Rs. | 5,000 |
| Any accidental ,, | 10,000 |
| Certain accidental death ,, | 15,000 |




The First Quadrennial, Valuation discloses a handsome Bonus.

The Fifth Annual Report is ready for distribution and will be sent to anyone interested.

**Wanted Agents to represent the Company in all important places throughout S. India**

PARTICULARS FROM :

M/S. K. R. CHARI & CO.
Chief Agents,
The Nisam's Dominions & Berars,
Sultan Bazaar,
HYDERABAD, Deccn.

NIRIKHI HANUMANTH RAO & BROS.
Chief Agents for
Ceded Districts,
FORT, KURNOOL, Kurnool Dt.

THE BRANCH SECRETARY
The Northern India
Insurance Company, Limited,
101, Big Street,
Triplicane, MADRAS.

---

# Sreemad Bhagavatam

## IN A NUTSHELL

AN

All-India Sanskrit-English Library Edition
with attractive tricoloured blocks

OF

## NARAYANEEYAM

Or Sreemad Bhagavatam in brief, a great literary asset with the impress of erudite scholarship and inspiring devotion of a great scholar and saint, the author, now published for the first time with an English translation into quarterly Volumes @ Rs. 3 each Postage Extra or Rs. 12 for the complete set. Postage Free. Subscribed for by several Universities, Colleges and High Schools besides several Maharajas and other eminent men.

*Apply Sharp to:—*

P. N. MENON, B.A., B.L.,
—*Editor*

INSURANCE, PALGHAT.

---

నేడే చేరుడు　　　నేడే చేరుడు

దేశారాధనకును, సురక్షితమునకును
చక్రనిమేనేజిమెంటుకును పేరుగన్న

## ట్రాపికల్ లో

మొదటి 5 సంవత్సరములకు

బోనసులు　　రూ 1000 కి రూ 50-0-0

ఈ కంపెనీవ్యవస్థాపకులు

శ్రీ. శ్రీ. హకీంఅజ్మల్ ఖానుగారు.
శ్రీ. శ్రీ. పండితమోతీలాల్ నెహ్రూగారు.
శ్రీ. శ్రీ. డాక్టర్ అన్సారీగారు.

ట్రాపికల్ ఇన్ష్యూరెన్సుకంపెనీ లిమిటెడ్
హెడ్డాఫీసు : ఢిల్లీ

వివరములు తెలియగోరువారు

బి. యస్. మణియం పిళ్లై, చీఫ్ ఆర్గనైజరు,
గాంధీనగర్, బెజవాడ.

యం. భక్తవత్సలంగారు.
బ్రాంచిశెక్రిటరీ, మద్రాసు.

Tropical

# ఓరియంటల్

## గవర్నమెంటు సెక్యూరిటీలైఫ్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

స్థాపితము 1874. హెడ్ ఆఫీసు : బొంబాయి.

**1935** నివేదిక — సంగ్రహము.

| | | | | |
|---|---|---|---|---|
| జారీచేసిన క్రొత్త పాలిసీలు | రూ. 8,89,89,149 | | చెల్లించిన క్లెయిముల మొత్తం | రూ 17,43,21,855 |
| పాలసీ ఆదాయము | ,, 3,49,16,412 | | పెరిగిన ఫండు మొత్తములు | ,, 17,01,62,491 |
| అమలులోనున్న పాలసీలు | ,, 59,25,32,038 | | | |

ఈ పైన తెలుపబడిన అంకెలు **ఓరియంటల్** యొక్క ప్రజాదరణ,
కంపెనీస్థిరత్వమునుగూర్చి వేనోళ్ళ చాటుచున్నవి.

ప్రజాదరణ బొంది దినదినాభివృద్ధిగాంచుచున్న ఈ హైందవ భీమాసంస్థలో మీజీవితము భీమా చేసికొనుటకు ఆలసింపవలదు.

వివరములకు : పి. హెచ్. గుప్త, బార్-ఎట్-లా సెక్రటరీ, ఉత్తరజిల్లాలు, గోడేవారివీధి, లేక ఈక్రింది ఉదాహరింపబడిన కంపెనీ కార్యాలయములకు వ్రాయవచ్చును. విశాఖపట్టణము,
ఆగ్రా, అజ్మీర్, అహమ్మదాబాద్, అలహాబాద్, అంబాల, బెంగుళూర్, బెరియేలీ, బెల్లారి, కలకత్తా, కాలికట్, కోయంబతూర్, కొలంబో, ఢక్కా, ఢిల్లి, గౌహతీ, గుంటూరు, జల్గాను, జల్పాయిగురి, జబ్బల్పూర్, కరాచీ, కోలాలంపూర్, లాహోరు, లక్నో, మాండలే, మధుర, మెర్కారా, మొంబాసా, నాగపూరు, పాట్నా, పూనా, రాయపూరు, రాజసాహి, రాంచీ, రంగూన్, రావల్పిండి, సింగపూర్, సుక్కూర్, తిరుచునాపల్లి, తిరువనంతపురము, విశాఖపట్టణము.

(Oriental)

KANAKARAJU'S

# INSURANCE DIRECTORY

## 1936

(IN TELUGU)

WILL BE READY AND PUBLISHED IN
**SEPTEMBER—1936.**

A New publication in vernacular. Very useful to Companies, Agents and Policy-Holders. The only publication of its kind.

Price For Companies Rs. 3- For Agents and Policy-Holders Rs. 2-8-0

PRE PUBLICATION PRICE

For Companies Rs. 2-8-0 For Agents and Policy-Holders Rs. 2

Postage Extra in all cases. Book your orders immediately with advance.

*Apply to :—*

THE EDITOR,
Bheema Patrica, Bezwada,

# Life Insurance as a Career

By K. SUBRAMANI AIYAR, B. A., F. S. A. A., R. A.

*Incorporated Accountant and late Principal of the Sydenham College of Commerce, Bombay.*

Ladies and Gentlemen,

I am exceedingly thankful to you, Mr. Ramachandra Rao and your Committee, for your having invited me to advise our young graduates on the choice of a career. The series of lectures that have been delivered during the last month under the auspices of your Committee must have made it clear to our young graduates that there are a number of honourable and lucrative careers open to them, outside Government service, if only they will take the trouble to qualify themselves for one of such careers. I have myself been engaged for the past fifty years in trying to divert some of our young men from official to non-official and business careers; the graduates and undergraduates who have been so diverted into business careers are now very well-off and do not regret having acted upon my advice. Government service should not be your sole or even your main objective, as there are many other careers open to you, in which the opportunities for services to our motherland and the prizes available are greater than even in Government service.

### No room for all in Government Service

Even the most paternal and autocratic Government cannot afford to provide jobs for all the graduates and undergraduates turned out annually by the eighteen Indian Universities except by enormously increasing the expenditure on salaries; and how is this huge additional expenditure to be met except by collecting heavy additional taxes? From whom are these additional taxes to be collected, except mainly and largely from agriculturists, industrialists, traders, merchants, and others not in Government service? As it is impossible for Government to absorb all our graduates and under-graduates, it becomes their duty in their own interests and in the interests of their country to select some other career and qualify for that career.

### Specialised Training Necessary.

A degree in Arts or Science will not, without further specialized training, fit you for becoming a lawyer, a doctor or an engineer; much less will that degree by itself fit you for becoming an accountant, an actuary, a banker, a merchant or an industrialist. You have to choose a profession or career for which you have an aptitude and undergo the necessary theoretical and practical training in it. The lectures that have now been arranged by Mr. Ramachandra Rao's Committee are intended to help you in the choice of a career and inform you as to the nature of the training, you should undergo for each of such careers.

### Prizes in Business Careers Much Higher

The salaries paid to Government servants are printed and published by Government in their official civil lists and made available to the public ; and the high salaries paid to the senior

officers of Government make you naturally anxious to enter Government service in the hope that you may become one of the lucky few to attain one of such high positions But no such civil lists are published by business concerns and you do not know what high salaries are paid even to undergraduates in companies and you have no knowledge of the very high annual income made by the many engaged in life Insurance or other business. These figures are known only to the Incometax authorities. If these figures of income are made known to you, your mouths would water and the craving for Government service would disappear. Life Insurance is one of those business careers in which the prizes securable by energetic and resourceful young men of character are sufficiently high to divert you from Government service.

### Life Insurance - A Social Service.

The Life Insurance contract is known as "The Policy of Insurance" by which the Insurance Company agrees to pay to the person insured a certain amount on his attaining, say, 50 or 55 years of age, or to his heirs on his death in consideration of the insured person promising to pay to the company a small sum in annual, half-yearly, or quarterly instalments called "The Premium". These premiums are calculated scientifically by an Actuary, based on mortality and interest tables. A large number of people thus co-operate to enable each of them to save what he can and make effectual and safe provision for his dependents. Insurance agents try to induce their fellow-citizens to insure their lives and thus provide for their families. Life Insurance is thus a form of co-operation and Life Insurance agents do a bit of social service while earning their livelihood thereby.

The object of the present lecture is to induce some of you to take up Life Insurance as a career, as it will be doing a bit of social service and as it will also enable you to obtain an honourable livelihood for yourself. But you may well ask if the field is not already saturated and if there is enough scope for new entrants. I hope to convince you that there is plenty of scope for a large number of additional workers in this line.

### Is there enough scope for New Entrants ?

We have only about 180 Life Insurance Offices in the whole of India and Burma with only 8½ lakhs of policies in force ; not infrequently, one and the same man may have 3 or 4 policies on his life. Even assuming that every policy of insurance represents a separate individual, can 8½ lakhs of policies for a population of 3,600 lakhs be deemed a satisfactory percentage, as it means that less than one-fourth of one per cent. of the population have insured their lives ? Can the insurance field be deemed to have become saturated with over 99¾ per cent. of the population uninsured ? Is there not then much scope for more social service in the shape of Insurance canvassing?

The total amount insured under these 8½ lakhs of policies in force is about Rs. 200 crores, while the corresponding amount in that small, but go-ahead country, Japan, is Rs. 1,200 crores. If we are to reach the Japanese standard of Life Insurance, we shall have to increase the insured amount from 200 crores to 1,200 crores and

consequently increase the number of Life Insurance Policies from 8½ lakhs to six times that number, i.e., to about 50 lakhs of policies. This means that new entrants will have to secure an additional 41½ lakhs of policies. How can you then say that there is no scope for additional Insurance and for new entrants ?

Further, new policies of Insurance are secured every year. According to the latest figures available, 1,50,000 new policies were secured last year for an insured amount of thirty crores yielding an annual premium income of 150 lakhs of rupees At a conservative estimate, canvassers will be paid a commission of thirty per cent. on the first year's premiums collected in respect of new business. The commission that will be paid in respect of the new business above referred to will be 30 per cent. of 150 lakhs of rupees, that is to say, 45 lakhs of rupees. The canvassers of the above new business will, in addition to the above 45 lakhs of rupees, be paid every year for a period of about 20 years a commission of five per cent. on renewal premiums, i. e. on the annual premiums collected in respect of the ab ve policies — that is 5 per cent. on 150 lakhs of rupees, which amounts to 7½ lakhs of rupees. In other words, the canvassers who secured 1,50,000 policies last year yielding an annual income of 150 lakhs of rupees, are in the aggregate paid in the first year 45 lakhs of rupees and in every subsequent year for, say, 20 years, 7½ lakhs of rupees.

### Commission Paid to Canvassers.

The commission paid last year to Insurance canvassers by the various Life Insurance companies in India amounted to 95 lakhs of rupees as under.—

| | Lakhs of Rs. |
|---|---|
| 30 pet cent. on First year's premiums, *viz.*, on 150 lakhs of rupees collected in respect of new business .... .... | 45 |
| 5 per cent. on renewal premiums collected, *viz*, on 10 crores of rupees in respect of the old policies in force amounting to 200 crores .... .... | 50 |
| Total commission paid to Canvassers in the year .... .... | 95 |

The actual amounts paid out may be somewhat greater as some companies pay still higher rates of commission. The commission paid to canvasers last year by one company alone—namely, the "Oriental", amounted to 21 lakhs of rupees on a total premium of 240 lakhs of rupees which — amount to a payment of over Rs. 2,000 to each of 1,000 canvassers ; and remember that the "Oriental" is only one, though the biggest, of the 180 companies in India.

### Different kinds of Work and Qualification therefor.

There is scope in Life Insurance business for young men of different capacities, provided they are men of character with an honest determination to do their best and a will to overcome obstacles There is room for the mathematical genius, the steady, though not bright, worker, as well as for young men who fail in some subjects at their University Examinations but are very good at games and are known for their sociability. Life Insurance business may roughly be classified under three main heads:—

(1) *Field Work or Out-door Work*: Under this head come the Canvassers, Agents, Organisers and Inspectors. A mere book-worm, clever in passing examinations, will not do for this kind of work. Young men who have become leaders in their school and college sports, in their debating societies and in the organization of parties and excursions will be admirably suited for this kind of work, provided they are not too sensitive, or thick-skinned, and have a sense of humour. They must have the capacity to make friends and to retain the friends they have made. Your annual income in this field of work will range from Rs. 500 to Rs. 5,000 and even to Rs. 15,000.

(2) *Office Work*:—Clerical, Secretarial and Managerial This department will suit those fit only for desk work. You can hope to rise in this department to a position worth Rs 2,000 a month, if before entering an Insurance Office you acquire a theoretical knowledge of such office work, in the manner I shall indicate later on.

(3) *Actuarial Work* :— This requires a knowledge of Higher Mathematics and an aptitude for figures, which alone will enable you to become full-fledged Actuaries. There are Indian actuaries who are paid from Rs. 1,000 to Rs. 2,000 per month.

**Canvassers.**

Assuming that the annual premium on a Rs. 1,000 policy is Rs. 50 and that you are paid a commission of 30 per cent. on first year's premium and a commission of 5 per cent. on subsequent premiums (renewal premiums), you can easily earn an income of Rs.125 a month during the first year rising to Rs. 200 a month during the fifth year and become entitled thereafter to a renewal commission of Rs. 80 a month for at least 15 years more. This is on the assumption that you are able to secure during each of those five years 25 policies of Rs. 4,000, i. e., policies of the face value of one lakh of rupees.

With enough push and enterprise and some luck, you may reasonably expect to secure an increasing amount of new business as you go on acquiring experience. Let us now work out the figures for two successive periods of five years.

| | | | | |
|---|---|---|---|---|
| 1st year | 25 policies of Rs. 4,000 each, equal to | policies for | | 1 lakh |
| 2nd „ | | do | do | 1 „ |
| 3rd „ | | do | do | 1 „ |
| 4th „ | 50 | do | do | 2 lakhs |
| 5th „ | 50 | do | do | 2 „ |
| Total policies secured in 5 ys. for | | | | 7 lakhs |
| 6th year | 75 policies of Rs. 4,000 each, equal to | policies for | | 3 lakhs |
| 7th „ | | do | do | 3 „ |
| 8th „ | 100 | do | do | 4 „ |
| 9th „ | 100 | do | do | 4 „ |
| 10th „ | 100 | do | do | 4 „ |
| Total policies secured in the second 5 years ... | | | | 18 lakhs |

( To be Contd. ) —INDIAN INSURANCE.

Reg. No. M. 2749.





Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.